# గేయకథలు



రస ప్రియ

—

ఫోతేదార్ కేశవాచార్య



తెలుగు విశ్వవిద్యాలయము వారి
ఆర్థిక సహాయంతో ప్రచురితం

GEYAKATHALU

By RASAPRIYA
Keshava harya Fotedar
(Retd.) Chi f Planning Officer


భోజ ప్రచురణలు : 9

ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి 1993

చిత్రములు : ఎం. వెంకటాచారి

వెల : రు. 15

ప్రతులకు :

రామకృష్ణ ఫోతేదార్
6-2-23 A
తుమ్మలగడ్డ బజారు
ఖమ్మం - 507 001

ముద్రణ :

నాగేంద్ర ప్రెస్
సూర్యారావుపేట
విజయవాడ - 520 002



"వాగార్థావివసంపృక్తౌ

వాగర్థప్రతిపత్తయే !

జగతఃపితరౌవందే

పార్వతీపరమేశ్వరౌ !"



# అమరస్మృతి

రక్తి
తాను
స్మృతి

మా ప్రియతమ జ్యేష్ఠ కుమారుడు ఫోతేదార్ రవిబాబు (భోజ) 18-10-92 తేదీన స్వర్గస్థుడాయెను. వాని యిష్ట దేవత లగు పార్వతీపరమేశ్వరులు వాని ఆత్మకు శాంతి కలిగించి వానికి పుణ్యలోక ప్రాప్తిని ప్రసాదింతురుగాక!

జననం: 14-10-1949 - నిర్యాణం: 18-10-1992

"అంగీరస ఆశ్వీయుజ
కృష్ణాష్టమి రవివారము
తిరిగి రాని పరలోక
మ్మరిగిన మా పెద్దోడా!
మమ్మువీడి హరి సాయు
జమ్ము జేరుకొన్నావా!
అశ్రుతర్పణముతో నీ
ఆత్మశాంతి కొరకై నీ
ఇ దేవతలు నగు గౌ
రీశ్వరులను ప్రార్థింతుము.
గేయము నీకి మనీ
"గేయ కథలు కృతి లోపల
నీ స్మృతి అమర స్మృతిగా
నిలుపుకొంటిమిర బాబూ!"

"అశ్రుతర్పణం" నుండి

—నీ అమ్మా నాన్నలు
తమ్ముళ్ళు చెల్లెండ్రు.

సహజ సంగీత ప్రియుడు సరస కవితాలోలుడు రవిబాబుకు భక్తి రక్తి రసాస్పదమైన పద్యాలు, పాటలు, కవాలీలు అంటే ఎంతో ప్రీతి. తాను తరుచు ఆలపిస్తూ ఆనందించే వాటిలో కొన్ని మాత్రం అతని స్మృతి చిహ్నంగా ఇచట ముద్రితం.

"అరయన్ శంతను పుత్రుపై విదురుపై అక్రూరుపై కుబ్జపై
నరుపై ద్రోవదిపై కుచేలుని పయిన్ నందవ్రజ స్త్రీలపై
పరగన్ గల్గు భవత్కృపారసము నాపై కొంత రానీ నీ
చరణాబ్జంబుల నమ్మినాడ జగదీశా కృష్ణ ! భక్తప్రియా "

"నేనొక పూలమొక్క కడ నిల్చి చివాలున కొమ్మ వంచి గో
రానెడు నంతలోన విరులన్నియు జాలిగ నోళ్ళు విప్పి "మా
ప్రాణము తీతువా" యనుచు బావురుమన్నవి క్రుంగిపోతి—నా
మానసమందెదో తళుకుమన్నది పుష్పవిలాప కావ్యమై !"

"పదముల్ సాలవు నీ పదాల్గొలువ భావంబంతకున్ జాలదిం
పొదవన్ నీ మహిమోన్నతుల్ బొగడ శంభూ ! యెట్లు వర్ణింతునే
చదువుల్ నేర్వగలేదు నీ పద సరోజ శ్రీలపై వ్రాలి చే
సెద నీ సంస్తుతి గానమున్ మధుపమై శ్రీరాజ రాజేశ్వరా !"

"శిరమందున్ శశి బంతి పూవుగను నీ సింగారు బంగారుగా
మెరయన్ గంగ తురాయియై వెలయ గంభీరార్చ్రితుల్ పొంగగా"

"ఓ భావిభారత భాగ్యవిధాతలారా! యువతీ యువకుల్లారా !
పెళ్ళి చేసుకొని ఇల్లుచూచుకొని చల్లగ కాలం గడపాలోయి
ఎల్లరు సుఖముగ నుండాలోయి మీరెల్లరు హాయిగ నుండాలోయి"

"నీలంపు మేఘమే నేల దిగివచ్చెనా
బంగారు కొండయే ముంగిటను నిలచెనా !"

"మబ్బు వన్నెకాడువాడు మత్తుమందు చల్లినాడు"

"యానవీ యానవీ యానవీ యానవీ యానవీ యానవీ !"

ఆచార్య ఎస్వీ రామారావు
తెలుగు విభాగం
ఉస్మానియా విశ్వవిద్యాలయం

# అభినందన

"రసప్రియ" కేశవాచార్య లేఖిని నుంచి వెలువడిన గేయ గాథా సప్తమి ఇది. వీర రసం ఉట్టిపడే వీర తిక్కన, శూర తానాజీ గాథలతో పాటు స్వామిభక్తిని, పరోపకారాన్ని ప్రబోధించేపే కథలు ఈ కృతిలో ద్యోతకమవుతాయి. కుటుంబ పరిమితిలోని పరమార్థాన్ని, పొదుపులోని ముందు చూపును చాటే కవితలు బహుమతికి కూడా పాత్రమైనాయి.

ఈ గేయ కథలు మూడు దశాబ్దాల క్రితమే విరచితమైనా ఈ నాటికీ నిత్యనూతనంగా గోచరిస్తున్నాయి. 'తెలివైన ఎన్నికలు' లోని చతురోక్తులే అందుకు నిదర్శనం.

"నాయకుడనగా మనలను    నాయనవలె జూచువాడ ?
లేక మనల భయపెట్టుచు    బాకు చూపు క్రూరుడా ?"

అన్న మాటలు వర్తమాన స్థితికి దర్పణం పడుతున్నాయి.

"శివ శివ నేడెన్నికలం    దవి నీతికి తావుకదా !
నీతిలేని నేడుకన్న    రాతి నాడె మేలు కదా !"

అన్నది నీతి మృగ్యమైన నేటి రాజనీతిపై చక్కని ఎత్తి పొడుపు. నిత్యజీవితంలోంచి గ్రహించిన ఉపమానాలు బాలురను సైతం అలరిస్తాయి.

"కాయగూరలు తరుగు    కరణి తిక్కన చేతి
కత్తికెరయై శత్రు కాయ ములు తెగిపడెను."

*   *   *

"తల పండు లెగిరె బం    తుల వోలె నేలపై"

*   *   *

"ఉంటే పై కుంటం లే    కుంటే ఊ కుంటమనును"

ఇంతేగాక ఇందులో వ్యంగ్యం ఉట్టిపడే సరసోక్తులు - మరొక చోట గుండెలు ద్రవింపజేసే కరుణరస పూరిత చరణాలు పఠితృలోకాన్ని కదలిస్తాయి.

"తినటానికి కరువుగాని కనటానికి కాదు గదా!
పోషించగ బరువుగాని పుట్టించగ కాదు గదా!"

× × ×

"చనుబాలకు చంటివాడు దినమంతా పోరు పెట్టు
పాల చుక్క లేని తల్లి రాలుచు కన్నీటి బొట్టు"

స్వతస్సిద్ధమైన అలంకారాలతో సరళ సుందర శైలిలో సాగిన ఈ గేయరచన ఆ బాలగోపాలాన్ని ఆకట్టుకొంటుంది.

"ఆత్మ గౌరవమ్ము భంగ మౌనప్పుడు పైచ నెవడు
తన్నినచో దుమ్మైనను తలపై నెగురంగ జిమ్ము"

× × ×

"పరిభవానల మెదద బడబాగ్ని యైరేగి
తడిగుడ్డ తనువుపై పొడిగుడ్డగా మారె"

భక్తి భావవిలసితమైన శతకాలను, రసరమ్యమైన రామాయణ గాథలను వెలువరించిన కేశవాచారిగారు నీతిదాయకమైన ఈ గేయ కథలను ఈ రూపంగా అందిస్తున్నందుకు వారికి నా అభినందన.

శ్రీముఖ ఉగాది డా॥ ఎ . రామారావు

24-3-93

సికింద్రాబాదు.

# ముందుమాట

నేనీ గేయకథలు వ్రాసి సుమారు 35 సంవత్సరాలు కావచ్చు. నవ సమాజ నిర్మాణానికీ శాంతియుత సహజీవనానికీ భావస్ఫోరకమైన సాంస్కృతిక, చారిత్రక కథలు నాటికీ నేటికీ నానాటికీ అవసరమన్నమాట కాదనగలమా ?

ఇందున్నవి ఏడు గేయ కథలు. రెండు జాతక కథలు. రెండు వీర గాథలు. మూడు కల్పిత కథలు.

సామాజికాభ్యున్నతికి చక్కని మార్గాన్ని చూపించే జాతక కథలు పాళీభాషలో వ్రాయబడినవి. మా గురువుగారైన వాజపేయయాజుల రామ సుబ్బారాయుడుగారు "Tales from pali" అను చిన్న చిన్న కథల పుస్తకం ఆంగ్లంలో వ్రాశారు. దానిని నేను వారి దగ్గర థర్డ్ ఫారమ్ చదువు తుండగా చూశాను అది అప్పటి మాధ్యమిక పాఠశాలల విద్యార్థులకు ఉప వాచకంగా నియమింపబడి అప్పటికే ఎంతో పాతదైపోయింది. దాని నుండి రెండు కథలు సేకరించాను. 1953లో 'తెలివైన ఎన్నికలు' కథను ఒక ప్రసంగంగా వ్రాశాను. అదీ హైదరాబాదు ఆకాశవాణిలో అప్పటి రేడియో అన్నయ్య కీ॥ శే॥ రాఘవరావుగారి ఆధ్వర్యంలో ప్రసారమైంది. తల ప్రోత్సాహంతో ఊపందుకుని దానినొక యకథగా మలిచాను.

పరోపకారి రెండవ జాతక కథ. పరోపకారం గొప్ప పుణ్యకార్యం. సందేహం లేదు. కానీ పాత్రౌచిత్యం పాటించకపోతే ప్రమాదం తప్పదు.

నీచుడు మేలొందియు తన నిజతత్వము మానునా ?
పాలోసిన వానినైన పాము చువకుండునా ?"

కానీ బుద్ధభగవానుడు తన వెనుకటి జన్మలో వడ్లపిట్ట రూపములో అపాత్రునకైన ఉపకారం చేయడంలో వెనుకాడలేదు. పోతే ఆ పని తెలివితో చేశాడు ప్రమాదపడకుండ. అదీ ఎలాగంటే ఆ కథ చదివి తెలుసుకోండి.

వీరగంధ పరిమళాన్ని విశ్వమంతట విరజిమ్మజేసే వీరగాథలు

రెండు. ఒకటి తెనుగుగడ్డకు చెందినది. రెండవది మరాఠీ సీమకు చెంది నది. 'ఖ తిక్కన' తెనుగువారికివెన్నతో పెట్టి చెప్పిన కథ. 'తానాజీ' వీర గాథ కీ॥ ॥ సురవరం ప్రతాపరెడ్డిగారు రచించిన "హైందవ ధర్మవీరులు" అను కథలనుండి గ్రహించబడినది. ఇకమిగిలిన మూడుకథలు కల్పితములు.

"స్వామి భక్తియన్న రామాయణమునాడె
ఉగ్గుపాల విద్య ఉరతకైన"

అను సాంప్రదాయం మనది. శ్వానమునకున్న విశ్వాసము లోపించిన కొందరికీ "స్వామిభక్తి" కథ కనువిప్పు వంటిది.

'ముందుచూపు' 'అప్రమత్తుడు' ఈ రెండు జాతీయ ప్రచారక ప్రగతి శీలక రచనలు. మొదటిది "పొదుపు" కథ పేరుతో 1965లో రాష్ట్రస్థాయి జాతీయ గేయ పోటీలలో ప్రథమ బహుమతి నందుకున్నది. రెండవది కుటుంబ నియంత్రణకు సంబంధించినది. అది 1968లో హైద్రాబాద్ ఆకాశ వాణిలో పాటగా ప్రసారమైంది. దాని సౌజన్యంతో 'అవర్ ఫ్యూచర్' హెల్త్ మాగజైన్‌లో ప్రచురింపబడినది.

సమాజంలో సన్నగిల్లి పోతున్న నైతిక విలువలు కొంతైనా మెరుగుపరిచి నేటి యువతరాన్ని అభ్యుదయపథం వైపు నడిపించగలవను ఆశయంతో నే నీ గేయకథలు నాకు సాధ్యమైనంత సరళ శైలిలో మాత్రా చందస్సులో పాడటానికి అనుకూలంగా ఉండేలా వ్రాశాను. నా ఈ ప్రయత్నమేమాత్రం ఫలించినా కృతార్థుడనైనట్లు భావిస్తాను.

ఈ గేయ కథలను వయోపరిమితి లేకుండా పిన్నలు పెద్దలు చదువు కొని ఆనందించవచ్చును. ఇవి మాధ్యమిక ఉన్నత పాఠశాలల బాల బాలికలకు ఎంతైనా ఉపకరించగలవని ఆశిస్తున్నాను.

ఖమ్మం
20-8-92

ర చ యి త

# కృతజ్ఞత

నా ఈ గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయం అందించిన తెలుగు విశ్వవిద్యాలయం వారికి ముందుగా నా హార్దిక కృతజ్ఞతలు తెలుపుకొంటు న్నాను. ఈ సహాయం లేకున్నచో ఈ గ్రంథం వెలుగులోనికి రాక పోయేది.

ఈ సందర్భంలో నా గురుదేవులు స్వర్గీయ వాజపేయయాజుల రామసుబ్బారాయుడుగారికి నా హృదయపూర్వక భక్త్యంజలులు సమర్పించు కొంటున్నాను.

నాయీ 'గేయకథలు' పుస్తకానికి తమ అమూల్యమైన అభి ప్రాయాన్ని వ్రాసి ఇచ్చిన సుప్రసిద్ధ సాహితీవేత్తలు ఉస్మానియా విశ్వ విద్యాలయం తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య ఎస్వీ రామారావు గారికి హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను.

ఇందలి కథలకు అనుగుణంగా అందమైన చిత్రాలూ ముఖ చిత్రము వేసిన మా రెండవ మనుమడు చిరంజీవి ఎం. వెంకటాచారికి అభినందనాశీర్వాదములు.

ఈ పుస్తకాన్ని ముచ్చటగా ముద్రించి ఇచ్చిన శ్రీ బాబూరావు ప్రొప్రైటరు నాగేంద్ర ప్రెస్సు విజయవాడ వారికి కృతజ్ఞతలు తెలుపు కుంటున్నాను.

రచయిత

# గేయకథలు

# తెలివైన ఎన్నికలు

అనగనగా వెనుకటి కొక
అడవిలోన బుద్ధుడు తన
పూర్వజన్మమున కాకిగ
పుట్టి వసించుచు నుండెను

ఆ యడవిని విహరించు వి
హంగములా బుద్ధ-కాకి
చురుకుదనము సూక్ష్మబుద్ధి
నెరిగి చాల గౌరవించు

వన్నెలో ప్రవ ర్తిలో వి
భిన్నములైనట్టి పక్షు
లెన్నెన్నో కనుపించుగ
ఉన్నవి ఆ వనమందున

ఒకచో వేటాడు న
బకములు రాబందులు పెను
గ్రుడ్లగూబలును గ్రద్దలు
గోలసేయ, వేరొకచో -

చిగురు మెక్కి జీవించెడి
చిలుకలు కిల కిల నవ గ

కోకిల లతి మధురముగా
'కుహూ కుహూ' మని పాడగా—

జంట గూడి పావురాలు
కొంతెగ సరసాలాడగ
పురులు విప్పి మయూరాలు
మురిసి నాట్యమాడగా—

కొలనులందు తెల్లని హం
సలు కలకల లాడగా
కనుల విందు గొల్పుచు ఆ
వనమెంతో వెలయగా—

## నాటి జనులలో ఎన్నికలు

ఈ రీతిగా నుండు
ఆ రోజులందు మా
నవులలో చిగురించె
నాగరిక జీవనము

బలవంతు డొకడు దు
ర్బలులపై నధికార
మును జూపు మొరటు తన
మును రూపుమాపగా

జనులలో విజ్ఞాన
మను సూర్యుడుదయించె
పశు బలమ్మను గాఢ
నిశలెల్ల నశియించె -

పట్టణాలలోని జనులు
మొట్టమొదటిసారిగా
తమ నాయకు నెన్నుకొనగ
సమావేశమై రొకచో —

కండ బలమె గుండె బలమె
కాక బుద్ధి బలము గలిగి
నిండుదనముతో నెప్పుడు
నెగడు నట్టి నియమ పరుని

సౌజన్యము గలిగి శాంతి
సౌఖ్యంబుల నెలకొల్పుచు
మనిషి విలువ లెరిగి బుద్ధి
మంతుడై చరించు వాని

తను గురించి తలపు మాని
జనులకై (శ్ర)మించు వాని
స్వార్థ మనగ నెరుగని ని
స్వార్థ పరుడైన వాని

మాట తప్ప నట్టి వాని
మంచిని ప్రేమించు వాని
కృతజ్ఞుడై ప్రజావళికి
హితమొనర్చు మహాత్ముని

దుర్మార్గుల శిక్షించుచు
సన్మార్గుల రక్షించుచు
శాంతి భద్రతల గూర్చెడు
సమర్థుడై నట్టి వాని

సమ్మెల కవకాశ మీక
సంకటములు దీర్చువాని
నిజ రిగి ప్రజామతము
నెరవేర్చెడి నేరుపరిని

పక్షపాత మింతైనను
కుక్షిలోన లేని వాని
తిపరుండై జాతికి
్రతిపాత్రుడైన వాని

తేనెవంటి మనసు కలి
మానవత్వమున్న వాని
ధర పరుని తా గపరుని
తమ దొరగా నెన్నుకొని .

అతడు ప్రజల కన్న బిడ్డ
లట్లుగ పోషించు చుండె
శాంతి సుఖము లొనగూర్చుచు
చల్లగ పాలించు చుండె

## జంతువులలో ఎన్నికలు

ఈ వార్త భూ చరము
లెరిగి తమ వనిలో అ
రాచకము మాన్పగా
రాజు నెన్నుకొనంగ

వట వృక్ష తతి క్రింద
వన్య మృగములు సమా
వేశమై ఎన్నికలు
వేడ్కతో సాగించె.

ఒక ఏను గొక వ్యాఘ్ర
మొక సింహ మెన్నికల
పోటీకి నిలచినవి
మూడె పా లపుడు.

ఆ కారము నందు తాను
అందరికిని మిన్నయనుచు

ఘీంకరించి ఏనుగు ని .
శ్శంక తోడ ముందు కరిగె.

అంత మృగము లన్ని పెద్ద
గొంతు తోడ నిట్లరచెను
వద్దు వద్దు ఇంత పెద్ద
మొ . రేడు మనకు వద్దు.

ఒకటి- చురుకుదనము సున్న దీని
కరెరే ! మెడయున్నదా ?
వెనుక నుండి వచ్చు శత్రు
వును కనుగొన గలదా

మరొకటి- ఇంత చిన్న జంతువునకు
ఎంత పెద్ద కన్నులోయి !
తొండ మెంత పొట్టి ! దీని
తోక యెంత పొడవు ఖాయి !

ఇంకొకటి- తప్పు తప్పు గొ వాళ
తప్పు లెన్న తప్పు గదా
గొప వాళ తో హాస్యము
ముప్పు తె పెట్టుగదా

శ్రీకారం లేని వారి
కాకారం లేదా ?
రాసులు మ్రింగే కత్తలు
రాజులు దా ?"

**వేరొకటి.-** వేళాకోళము లింకను
చాలని వేరొక టిట్లనె,
"మొద్దు గాని బుద్ధిపరుడు
ముందుకు వేరొకడు రండు.-"

ఒక్కొక్కటి రీతి
వెక్కిరించి విమర్శ
సేయగా గజరాజు
చిన్నబోవుచు దొలగె !

అంతట పులి దర్పముతో
అరుదెంచెను గాండ్రించుచు
నోరు విపి కోరలతో
క్రూర బలము ప్రకటించుచు

తన కన్నను మొనగాడే
ధరణి లోన లేనే లే
డని తనకే వోటిమ్మని
అహంకార మొలక బలికె.

"అబ బ్బా ! బెబ్బులి ఇది
అతి క్రూరంబైనది ఇది
ఆకలి కానపుడు కూడ
అగుపడితే చాలు చంపు.

దొడ్డ బుద్ధి లేని వాడు
దొరమైతే చాలు చాలు
దొడ్డ వాళ్ళ దొలగించును
దుర్మార్గుల నియమించును.

వలదు వలదు క్రూరమైన
పులిని రాజు సేయ వలదు"
అని ఏకగ్రీవమ్ముగ
అడవి జంతు మృగాలనియె.

అంతట పులి ఆగ్రహించి
గొంతు జించుకొని పెద్దగ
గాండ్రించుచు పైదొలగెను
ఖలుని గళము కరకు గదా !

ఇక మి లిన పోటీ దా
రొక సింహము; దాని కడవి
జంతు మృగాలన్ని ఒక్క
గొంతుతో జయమ్ము ప కె.

"కరి కన్న మిక్కి గ
చురుకైన వాడితడు
పులి న్న పలురెట్లు
బు గల ఘనుడితడు

శౌర్యమున శీలమున
సరి లేని వాడితడు
ఏనాటికైన మన
ఏలికగు సింహమే

"సింహానికి జై జై మన
సింహానికి జై జై !
శీల శౌర్యములు గల మన
సింహానికి జై జై" ! !

## పక్షులలో ఎన్నికలు

భూ చరములు సింగని తమ
భూపునిగా జేసికొన్న
సంగతి యెట్లుట్లో ఖే
చరముల కది తెలిసి పోయె

తాము తమ వారల సం
క్షేమమునకు ఎన్నికలను
జరుపు కొనగ నొక్కచోట
సమకూడెను పక్షులన్ని

బకము, గుడ్లగూబ, నెమలి
పక్షుల రాజగుటకు నై,
అభ్యర్థులుగా నిలచిన
నపుడు పక్షులన్ని గూడి -

"మా కందరి కన్న బుద్ధి
మంతుడవై నట్టి నీవు
మాకి కార్యమ్ము లోన
మార్గదర్శివై మెలగుము"

అని కోరుచు బుద్ధ-కాకి
న ంపగ నదియు నంత
ముందున కరుదెంచి ఇట్లు
ము క్తసరిగ మాట్లాడెను

పక్షి మిత్రులారా ! నా
పలు కొక్కటి వినుడీ !
నాయకునకు రెండు లక్ష
ణాలను గమనించుడీ !

ఒకటి 'సమర్థత' మరి యిం
కొకటి 'సత్ప్రవర్తన' మివి
రెండుండిన గుణవంతుని
రేనిగ మీరెన్ను కొనుడి !

అంత కొంగ అందెలిడుచు
అరుదెంచెను మునుముందుకు
బారెడు కాళ్ళీడ్చుకొనుచు
మూరెడు ముక్కొగ వేయుచు

తన పొడుగుదనమ్ము సమ
ర్థతకు తగిన చిహ్నమంచు
తన తెల్లని రంగు మంచి
తనమును సూచించుననుచు

పక్షులంత "బాబూ! ఇది
బకము, దీని నమ్మరాదు
తన తప్పులు దాచినంత
మన మెరుగమె దీని గుణము

పైన తెలుపుగా నున్నను
లోన నలుపు నిండి యుండు
పొడవుగ నున్నంతనేమి
బుద్ధి చిన్నదైయుండును

కపట జపమ్మొనరించుచు
కబళించును మీనములను
మోసగించు నైజము గల
ముచ్చు మనకు రాజగునా

వద్దు వ౼ కొంగనింక
గద్దె నె క్క నీయ వ౼
గోముఖ వ్యాఘ్రంబు
సా ములు కానీయవద్దు !

అని విమర్శన లగ్ని
కణములై చెలరేగ
కొంగ తొలగెను గుడ్ల
గూబ ముందుకు వచ్చె

భయము గొల్పు గుడ్లగూబ
పక్షుల రాజవా లి !
భయము వల్ల శాంతి కలుగు
భయ డె కావాలి !

దండన భయముండిన చో
తల ఎత్తదు దౌర్జన్యము
కట్టి నెవడు చేతదాల్చు
బట్టె వా గు సొంతము

నయము న్న భ యము మేలు
యము లుక యన
"కణతే వా చి
గొ యైన కరువదచే"

అని గ్రద్దలు రాబందులు
అరుచుచు బలపరచుచు కా
శికము పక్షిరాజగునని
శివమెత్తుచు నుండె, నంత—

తక్కిన ఖేచరము లెల్ల
ఒక్క గొంతుతో నరచెను
"భయపెట్టెడు గుడ్లగూబ
పక్షిరాజు కాజాలదు"

భయము వల్ల భయమె కలుగు
ప్రియము వల్ల నయము కలుగు
దండనతో కాక మంచి
తనము చేత సుఖము కలుగు

ద్వేషము ను ద్వేషముతో
త్రెంచగ-మేనాడును
క్రోధమ్మును క్రోధముతో
తూల్చగ లేమేనాడును

గుట్టమీద గుండ్లువేయ
గుట్ట తరగిపోవునా ?
అగ్గి మీద అగ్గి-యు
అగ్గి ఆరిపోవునా ?

చిచ్చును వర్షంబు కురిసి
చీకట్లను పొద్దు పొడిచి
ఉడకను పంఖాలు విసరి
ఉపశమింప జేసినట్లు

ద్వేషమ్మును ప్రేమముతో
రోషమ్మును శాంతముతో
భయమును ప్రియవచనముతో
నయముగా జయింపవచ్చు

నాయకుడనగా మనలను
నాయనవలె జూచువాడ ?
లేక మనల భయపెట్టుచు
బాకు చూపు క్రూరుడా ?

నాయకుడన నాయనయా ?
నాయకుడన యముడా ?
దయతో పాలించు వాడ ?
దండించెడి వాడా

మీరే యోచింపుడు ఈ
క్రూరమైన గుడ్లగూబ
తక్తు నెక్కి మనల నెపుడు
దండించుట కొరకేనా ?

పవలంతయు నిద్రించును
పని సేయును రాత్రివేళ
ప్రకృతి విరుద్ధంబైనది
వికృతమైన గుడ్లగూబ

దీని రాజు చేసినచో
'ఖూనీ' యౌ జాతియెల్ల
దీని నింక తొలగించుడు
రానిండింకొకని ముందు"

నిలచిన అభ్య యింక
నెమలి యొక్కటే దానికి
బు కా ముందుగ తన
'ప టు' వేసె ముచ్చటుగా

అది జూచిన పక్షులన్ని
ఆనందముతో సొగసగు
నెమలి గుణాలొక్కసారి
తమలో నూహించుకొనియె

అందరిలో అందగాడు
హానిచేయ నట్టివాడు
సరసుడు సాత్వికుడు మనకు
సంబరాలు గూర్చువాడు

అంతే గాకుండగ మన
చింతలు దొలగించగలడు
మన పాపల చంపు పాము
లను దిని కాపాడగలడు

వాయస సఖుడన్నట్లుగ
శ్రేయోరాజ్యము నేలగ
శీల సమర్థతలు రెండు
శిఖిలో గలవని పొంగుచు

"జై జై" యని పక్షుల ప్ర
జయ పెట్టుచు 'వోటు' హక్కు
నిర్వహించి ఎన్నుకొనియె
నెమలిని తమ రాజుగా.

శివ శివ ! నేడె ప్రకలం
దవినీతికి తావుకదా !
నీతిలేని నేడుకన్న
రాతినాడె మేలు కదా !

# ఖడ్గతిక్కన

వినరండి వినరండి
వీర బాలకు లార !
ఖడ్గతిక్కన వీర
గాథ వినరారండి !

ఒక చేత కలము వే
రొక చేత కత్తి బూ
నిన తెన్గు రాజ్య ల
క్ష్మిని గురించిన గాథ !

ఆత్మాభిమానమున
కసువు లొడ్డిన గాథ !
విభు గౌరవము నిల్ప
విప్రవీరుని గాథ !

మనుమసిద్ధి ప్రభువు
మంత్రి తిక్కన బుద్ధి
మహిమచే నెల్లూరు
మండలము పాలించ

గండర గండడై
ఖడ్గతిక్కన సర్వ
సేనానియై మనుమ
సి కండగ నుండ

ఒక వత్సరాన కా
టకము రాగా "ఎఱ్ఱ
గడ్డపాడు" న పశు
గ్రాసమే కరువయ్యె !

ఆ సీమ విభుడైన
యాదవేంద్రుండపుడు
మనుమసిద్ధిని ప్రతి
మాలె నీ విధముగా

"కసవుకై మా పశువు
లనువులను విడనుండె
కొంత కాలము మాకు
గోభిక్ష నిడు ప్రభూ !

పుల్లరిని నే తమకు
చెల్లించు కొనువాఁడ
మా పసుల తమ సీమ
మేపుకొన నీ రేడ !"

మనుమసిద్ధి ప్రభువు
అనుమతిడ నెల్లూరు
గడ్డపై తన పసులు
గడ్డి మేయుచు బ్రతికె

కాటకంబా యేడు
కడతేరి పోయినది
కాని "కాటమరాజు"
కాని పంపకపోయె !

అవసరము తీరిన ఆ
నంతరము గానుపిం
చని కృతఘ్నుని భంగి
"కనిగిరి" ప్రభువయ్యె !

తెగియించి సొమ్మెల్ల
యెగబెట్ట దలఁచి
ధనమడుగ వచ్చు దూ
తను తూల నాడె !

"మీరాజు మగటిమికి
ఔర ! తగు సేనాని
ప్రాప్తించెనే మమ్ము
భయపెట్టగా నేడు

పప్పు బాపల పేర్లు
చెప్పి బెదరించునా ?
ఉడుత లూపుకు వేప
లూగునా ? కదలునా ?

రమ్మనుము రణమునకు
దమ్ములుండినచో
బయటపడు మీ రాజు
బండార మప్పుడు

మాకు సామంతుడై
మా కీయ కుండె
కప్పమెన్నాళ్ళొ బ
కాయ పడి యుండె

మా మంచి తనముచే
మే మూర కున్నాము
మాస వంతులమైన
మండలా శులము

మీ పొలాలందునను
మా పసులు మేయతగు
కనికరింతుము క్షమా
ర ణ చెప్పుకొనుమనుము''

వట్టి చేతుల తిరిగి
వచ్చె నన్నంభట్టు
ఈటె మాటలు గుండె
నాటుకొని పోవగా

తన రాజు నిందు కొ
ల్వున నందఱును వినగ
అన్నదన్నట్లుగా
అతడనియె నెల్లెల్లో !

జననాథు కొలువులో
సామంత నృపులెల్ల
కనుబొమలు ముడివడగ
ఖడ్గాలు దూయగా

రణ తిక్కఁ డంత చ
య్యన లేచె రుద్రుడై
ఉద్రేకమున వీర
భద్రుడై గర్జించి

విభుని అవమానించ
విప్రవీరుని కనుల
విస్ఫులింగము లెగసి
ప్రస్ఫుటము కాగా

పండ్లు పటపట కొరికి
పలికె తిక్కండిట్లు
"ప్రభువరేణ్యా! నన్ను
పంపు డీ క్షణమే

యాదవాధము పొగరు
నణచి కప్పము దెత్తు
పప్పు బాపని బాహు
బలము రుచి చూపింతు

మాట దప్పిన వాఁడు
మానవంతుడె వీడు
మన యింటిలో గుడిచి
మన కెనరు బెట్టెగా !

కాళ్ళు బట్టిన మరు
క్షణము జుట్టు గ్రహించు
నీతిహీనుడు పరమ
నీచాధముడు వీడు"

అని తిక్క డావేశ
మున 'వీని లెక్కేమి'
టని అల్పసైన్యమ్ము
గొని యేగె రణభూమి



రణతిక్కఁడ తవ య్యానలేచె రుద్రుడై
ఉద్రేకమున వీర భద్రుడై గర్జించి

ముందుగా కాటముడు
ముప్పెరిగి సేనలను
సమకూర్చుకొని సర్వ
సంసిద్ధుడై యుండె

పాలేటి యొడ్డు కడ
పంచ లింగాల కడ
ఉభయ సేనల మధ్య
యుద్ధంబు చెలరేగె

కణ కణ ధ్వనులతో
కరవాలములు మెరసె
రణభూమి క్షణములో
రక్త సిక్తంబయె

తల లెగిరి పుట్ట చెం
డుల వోలె తెగిపడెను
ఖడ్గ ధాటికి భుజ
స్కంధాలు విడిపడెను

అవని దెగి పడి కూడ
ఔడు గఱచిన తలలు
మొదలంట దెగి ఖడ్గ
ముల విడని పిడికిళ్ళు

నెత్తురులు కాల్వలై
నిండి పొంగులు వారె
పొలేరు పై నిండ
పారాణి బూసికొనె

ఆవేశమున తప్ప
టుంచనాతో తిక్క
డల్ప సైన్యము తోడ
అరిబలము ఢీకొనెను

యదు న సంభ్రమై
అతిశయించగ దాని
మధ్య తిక్కని సేన
మడసి మాయంబయ్యె

రణ తిక్కడొక్కడే
రణభూమిలో నిల్చి
అపరాభిమన్యుడై
అరిబలము నెదిరించె

అదురు బెదురును లేక
యదుసేన పైబడెను
కరులపై లంఘించు
గండు సింగం బట్లు

ఖడ్గంబు ఖడ్గ తి
క్కన చేతనుండ నా
తని దాక యదుసేన
వెను కాడగా జొచ్చె-

అగ్ని శిఖ శలభంబు
లంటు కొనినట్లుగా
అతని దాకగ వచ్చు
అరిసేన హతమాయె

చినమ నాయుండపుడు
మును ముందు కరుదెంచి
భక్తితో తిక్కనకు
ప్రణమిల్లి యిట్లనియె

"మీరు బ్రాహ్మణులు స్వా
మీ ! శూద్రులము మేము
మీ పాద కమలాలు
మేము సేవించెదము

పోరాటమును మాని
పొండయ మీరింక
బ్రహ్మ హత్యా పాప
పంక మంటును మాకు"

అన వినియు ఖడ్గ తి
క్కన వీడ దని భూమి
అరిసేనలను ద్రుంప
నతని ధ్యేయంబౌకటె !

అప్పుడాతని అశ్వ
మలసి తన సేనలను
గనక బెదరుచు పారె
కదన రంగము నుండి

అది గ జంతువై
అజ్ఞాని యగునా ?
ఆపదను దెలిసి తా
నటు లొనరించెనా !

తన పతిని రక్షించు
కొన 'చైత' కిష్టేమ
హారాణతో గూడి
అని వీడి పర్వెత్త

గృహముఖంబై గుఱ్ఱ
మే తెంచె రౌతుతో
దురము వీడిన తిక్క
డరుదెంచె పురమునకు

స్వాస్థ్యంబు బొంది తగు
సైన్యమ్ముతో మరలి
రణ భూమి కేగ వ
చ్చని తిక్కడూహించె

కాని విజయ పతాక
లేనిదే గృహమునకు
తిరిగి రారాదంచు
తిక్కడెంచక పోయె!

శూరులకు విజయమో
వీర స్వర్గమొ కాక
రణభూమి విడి పారి
రారాదు రారాదు

జయ పతాకము లేక
జయ నినాదము లేక
వ్రాలిన వదనముతో
వచ్చు తిక్కని జూచి

పారి వచ్చెనటంచు
పౌరజన మే వగిం
పున జూడగా చివు
క్కునె మనసు తిక్కనకు

మూతులను ద్రిప్పిరి
ముదిరాంధ్రుడు కొందరు
నెటి కళ్ళు విరచిరి
నెలతుకలు కొందరు

బాటలో బాలకుల
ఆట యుద్ధము లోన
బాలుడొ డోడి తల
వంచికొని గృహమేగ

"ఆడుది కన్న వీ
డధముండు రణరంగ
మును వీడి గృహమునకు
చను చుండె చూడు" దని

గేలిసేయుచు నగిరి
బాలకులు కొంద రపు
డవురవుర ! ఎంతలో
కువ పారు బోతనిన.

"పిరికిపందకు వీర
బిరుదంబు లేలరా ?
పారుబోతుకు శూర
ఖండనంబేలరా ?"

అని యిట్లు బాలకులు
హాస్యాలు చేయ
విని విననియట్లు తి
క్కన గృహంబేగె.

తురగంబు దిగిలోని
కరుదెంచె తిక్కన్న
కలహించు కున్నట్లు
పలకరించ రెవళ్ళు

తన యింటిలోననే
తనవారికే తాను
గుర్తులేనటువంటి
కొత్త చుట్టంబాయె

సతి ముఖము చిట్లించి
పతిని గని కననట్టు
లరిగె లోనికి - తండ్రి
పరికించకే పోయె

ఎరిగియును నెరుగ న
ట్లేగె లోనికి తల్లి
ఏదొ పని యున్నట్లు
ఏమందు కటకటా !

తన ముద్దు పట్టియును
దగ్గరకు రాదయ్యె !
అతని కందరు కొ త్త
యై పోయిరక్కటా !

తానె చాపను పఱచి
మేను వాల్చి, స్వయంకృ
తాపరాధము నెంచి
తన్నుతా దూ ంచె

కొంతసేపటి కతని
యింతి కంఠము వినగ
వచ్చె "నీళ్లాడ లే
వగ వచ్చు" నంచును

అతడింట కొ త్తవా
డైనట్లుగా నామె
అశరీర వాణియై
అగుపించకే పలికె

ఇల్లాలికే అంత
యిది యైన, పెరవారి
కెంత లోకువో ! చెప్ప
చింతించగా నగునె ?

స్నానవాటి కతండు
చనుదెంచి చూడగా
నులక మంచంబొకటి
నిలబెట్ట బడియుండె

మంచంబు మాటుగా
నుంచబడె నీళ్ళబిం
దియ పసుపు ముద్దయును
స్త్రీ జనాళికి వోలె

తిక్కనికి తెక్కెక్కి
తీవ్ర కంఠము తోడ
"ఏమిటిది ? యంచు క
ళ్ళెఱ్ఱ జేయుచు నురిమె

అంత చిన్నమ యిట్టు
లని దులిపె "చాలులే
మగవారిలో మీరు
నగుబాటు కాలేదె ?

పగతురకు వెన్నిచ్చి
పారి వచ్చితి రింక
మీ మగటిమిని గూ
మెచ్చుకో తగునులే

మగవాడవని నన్ను
మా తండ్రి నీకిచ్చె
బొరపాటుచే - పట్టి
పురుషుడవు చూపుకే !

ముగురాడ వారమై
పోతిమిక యింటిలో
మగువవలె స్నాన మా
డగ మీకు వగపేల ?''

అని యీసడింపుతో
ఆమె పలికిన యంత
నోరెత్త నింకేమి
దూరునో యని తలంచి,

మౌనముద్రిక దాల్చి
స్నానమ్ము జేసి మడి
పంచెకై చూడగా
న్పించె నచ్చట చీర -

పుండుపై కారమ్ము
పోసినట్లై చిట్టు
మని చీర నెడమకా
లిని దన్ని విసరుతో

పడిపడిగ వంటింట
తడిగుడ్డ తోడనే
వచ్చికూర్చునె తల్లి
వడ్డించె మౌనముగ

మాటి మాటికి ముద్ద
మర్ధించి తినబోవ
ఇంపుగాదేది భుజి
యింప బోయిన గాని

ఉదరాగ్ని ఒకవంక
హృదయాగ్ని ఒక చెంప
రగుల మ్రింగుడు పడునె
రవ్వంత ముద్దైన ?

పరిభవానల మెడంద
బడబాగ్ని యై రేగె
తడిగుడ్డ తనువుపై
పొడగుడ్డగా మారె !

ములుకు పలుకుల తోడ
ముద్ద మ్రింగుడు పడదు
మెర మెరమ్మన మనసు
మెతుకు గతుకంబడదు !

విడిచె నన్నమ్మంత
కుడిచి కుడువక లేచె
అమ్మా ! ఒకిన్ని పా
లిమ్మనుచు తానడిగె

విరిగిన మనసుతోడ
విరిగి పోయిన పాలు
తల్లి యిచ్చెను తాను
త్రాగబోవుచు నాగి,

'ఈనాడు పాల్విరిగె
నెందుకమ్మా !' యంచు
పలికె నంతట తల్లి
బదులాడె నీరీతి

"పగతురకు వెన్నిచ్చి
పందవై అని నుండి
పాఱి వచ్చితివి నీ
పసవిరిగె కొడుకా !

విరిగె పౌరుషము
విరిగె నీ వంశము
విరిగె పశువుల పాలు
మెరు ేవా తిక్కా !

అసదృశమ్ముగ కదన
మందరుల గెలువ లే
[1]కసి వైచి పోరుఁబో
తై వచ్చితివి గదుర !

వీరమాతను గాక
పోరుఁబోతును గంటి !
కని గొడ్డురాలనయి
తిని గదుర తిక్కా !

గొడ్రాలనైయున్న
కొతుకు లేకుండెడిది
వేయేల నా ప్రసవ
వేదనే తపె డిది'' !

గుండె లోపల ఎముక
గ్రుచ్చుకున్నట్లయ్యె !
మాటలే ఈటెలై
మది నాటినట్లయ్యె !

ఉత్తరాపోశనం
బొనరించి లేచె చి
య్యాన పీటనుండి తి
క్కన తిక్క తలకెక్క

అ = కత్తి. క ము

క్షణమాత్రమున కవచ
మును దాల్చి ఖడ్గ ఖే
టములచే బూని గు
ఱ్ఱము నెక్కి అనికరిగె

పౌరుషంబుపొంగి
కారు చిచ్చయి రేగె
అణువణువు రోషా గ్ని
కణకణముగా మారె

పాలేటి యొడ్డు కడ
పంచలింగాల కడ
పగతురను గలిసికొని
ఖండనం బొనరించె

గరళధారుల మధ్య
గరుడుడే వ్రాలెనా ?
గడ్డివాముల నగ్ని
కణమె చెలరేగెనా ?

పదునా లోకాల
భస్మరాశి యొనర్చ
గల కౌశికుని వోలె
ఖడ్గతిక్కడు వచ్చె

క్షాత్ర సంతతి నెల్ల
సంహార మొనరించ
బ్రహ్మతేజము తోడ
భార్గవుండే వచ్చె

అరిసేనపై తిక్క
డగ్గి పిడుగై పడెను
త త్తరము బుట్టి యా
దవసేన భయపడెను

ఉండుండి గుండెలో
గుండు పడినట్లయ్యె
ఎటనుండియో మృత్యు
వే వచ్చి నట్లయ్యె

కాయకూరలు తరుగు
కరణి తిక్కన చేతి
క త్తికెరయై శత్రు
కాయములు దెగిపడెను

తలపండు లెగిరె బం
తుల వోలె నేలపై
మొండెముల నుండి చి
మ్ముచు నుండె నెత్తురులు

శత్రు రక్తంబంటి
క్షాత్రము మెరసెరా !
ఖడ్గతిక్ష్ణన చేతి
కత్తి కరుకెత్తెరా !

మెరపు మెరసిన యట్లు
కరచాలనము మెరయ
ఉరుము మినటు తిక్ష్ణ
డురిమి పోరొనరించె

కరవాలమా కాదు
గండ్ర గొడ్డలిరా !
పప్పుబాపడు కాదు
పరశురాముడురా !

ద్రోణునకు తమ్ముడై
తోచె వీడౌరా !
బ్రహ్మతేజంబెవడు
ప్రతిఘటించునురా !

హ్మతేజము నెదుర
బ్రహ్మతే మె ఉ
యని బ్రహ్మరుద్రు తి
క్ష్ణన కుజ్జిగా బనిచి

రంత వీరోత్సాహ
మంతు దప్పెను విప్ర
యోధులుభయులు ద్వంద్వ
యుద్ధంబు గావించ

కోడిపుంజులు రెండు
కొట్లాడినట్లురా !
పొగరు కోడెలు రెండు
పోట్లాడినట్లురా !

హరికిహరి కరికిఁగరి
సరితూగినటు విప్ర
వీరులిద్దరు పోరు
ఘోరంబుగా జేయ

అశా లమీదుగా
ఆలమ్ము కొనసాగె
కరవాలములు రెండు
ఖంగుఖంగున మ్రోగె

ఘోరంబుగా పోరు
కొంతసేపటు సాగె
ంత దూకిరి వారు
యము ల పైనుండి

కఱ్ఱయుద్ధము కాదు
ఖడ్గయుద్ధమురా!
తాకు తాకుకు రక్త
ధారలే చిమ్మురా!

రణములో విరియ బూ
చిన మోదుగుల వోలె
రక్త గంధాన వా
రల దేహములు మెరసె

రక్తంబు మేన ధా
రలు ధారలుగ జిమ్మ
సమరాన వారలు వ
సంత మాడిరి చూడ

తడిసెరా! రక్త గం
ధాన జంధ్యము కత్తి
ధీ భుజోన్నత శక్తి
దీపించెరా! ధాత్రి!

బ్రాహ్మ్యమ్ము క్షాత్రమ్ము
పరిణయంబాడెరా!
శాస్త్రము శస్త్రము
జ ట చెరా!

ఎంతకును విజయమ్ము
ఎవరిఁజేరకపోయె
విప్రవీరుల పోరు
వింతగా దోచెరా !

చివరి రక్తపు బిందు
చిందు నందాకరా !
బొందిఁ బ్రాణాలుండు
నందాక పోరురా !

తిండి నీళ్ళను లేక
తిక్క డేతెంచె గద !
తినితేపి కూర్చుండి
చనుదెంచె ప్రతిపక్షి

ఎంత యలసిన నేమి
ఎంత సొలసిన నేమి
రణతిక్క డని భూమి
వెనుదీయ దొక్కింత

ఎంత సేపాయె అని
కేతెంచి తిక్కన్న
రక్తధారలు మిగుల
ప్రవహించెరా మేన !

ఖడ్గ తిక్కన కళ్ళ
క్రమ్ముకొనె చీకట్లు
వడి తగ్గె కుడిచేతి
వళ్ళంత సోలెరా!

అదనెరిగి ప్రతిపక్షి
అంత విసరెను కత్తి
శివశివా! తిక్కన్న
శిరము తెగిపడగా!

తెగి తెగక మొండె తా
తెగనరికె బ్రహ్మారు
ద్రయ శిరము, నొకసారె
తలలు రెండును వ్రాలె!

సమరాన అమరులై
క్షాత్రమ్ము మెరయగా
సూర్యమండలము భూ
సురవీరు లే రిహా!

తన రౌతు తిక్కన్న
తలనోటఁ గరచుకొని
తురగ ము పరుగుతో
దె చె గృహామునకు

అది చూచి హా ! కొడక !
అని ముసలి తలిదండ్రు
లసువులప్పటి కపుడు
హరహరా ! విడిరకట !

ప్రాణేశ్వరుని శిరము
భక్తిఁగరములఁదాల్చి
సహగమన మొనరించె
సతి చిన్నమాంబపుడు

వినరండి ! వినరండి !
వీర తిక్కన గాథ
వీర రస ముప్పొంగు
విప్రవీరుని గాథ !

# స్వామిభక్తి

అనగనగా ఒక ధనికుడు
అతని ఇంట బంటొక్కడు
కుక్షి నింపి గురకలతో
కుంభకర్ణు నిద్రపోవు

ఆ ధనికుని కొక శునకము
అది నమ్మకమైన బంటు
ఆ యింటిని రేయిబవలు
కాయుచుండె మెలకువతో

తిని విడచిన రొ ముక్క
తినును గాని తిండి కొరకు
దిగులు చెంది యజమానుని
తెగనాడదు జంతువైన

ఒక్కనాటి రాత్రివేళ
టక్కరి దొంగొక్కడు ఆ
ఇంటికి కన్నము వేయగ
నేగుదెంచె నంతలోన

"బౌ బౌ"మని శునకరాజు
పైబడి కరువంగ వచ్చె
భయపడి ఆ దొంగవాడు
పారిపోయె పనిగాదని

మరునాడొక చోట వాడు
మరుగున ఆ బంటుతోడ
గుసగుస లాడెను-దానిని
పసిగట్టిన దాశునకము

బంటువాడు దొంగవాని
జంటగూడి పోయెనకట !
"కంచెయె చేనెల్ల మేయ"
కాపాడగ దిక్కెవ్వరు ?

కావలివాడే ఇంటికి
కన్నము వేయగ దలచిన
ఎవడు దిక్కు "ఇంటి దొంగ
నీ   రుడే పట్టలేడు".

పన్నాగము నెరవేర్చగ
అన్నములో విషము గలిపి
పెట్టెబంటు కాని కుక్క
ముట్టదెంత తెలివి గలది !

శునకము జీవించి యుండ
చెనటుల పని సాగలేదు
దాని జంపి గాని దొంగ
తనము చేయ వీలులేదు

చీకటి కమ్మిన రాత్రిరి
బాకొక్కటి కుక్కడొక్క
లోన దూరె "కుయ్ కుయ్" మని
ప్రాణములను గ ట్టుక

సరసర నెత్తురు జిమ్మగ
గిరగిర కన్నులు దిరుగగ
మొరగలేదు కరవలేదు
దొరలి పొరలి పోవునెటకో.

కుక్క చచ్చి పోయెననుచు
నక్కి యున్న వారిద్దరు
తమ పని నెరవేర్చు కొరకు
ధనముండెడు గది జొచ్చిరి

కొన ప్రాణముతో శునకము
తన దొర నిద్రించుచుండు
గదిలోనికి వచ్చి అతని
కాళ్ళపైన బడిపోయెను

నిదుర నుండి దిగాల్పడుచు
'ఇది యేమ'ని అతడు లేచి
సొద సొద నెత్తురు గార్చుచు
స్రుక్కి పడిన కుక్కను గనె

హీన స్వరమందు నుండి
శ్వానము వినిపించునెదో!
దాని అర్థమెరిగినచో
తనువెల్లను పులకించును

శుష్కించిన గొంతునుండి
శునకము వినిపించు మూల్గు
లోని మూగ భాషకు ము
ల్లోకములే తలయూపెను

"దొరా! లెమ్ము ఇంటిలోన
దొంగలు పడినారట, నా
బొందిలోని ప్రాణమ్ములు
పోకముందె మేలుకొమ్ము

ప్రాణమ్ములు తీయునట్టి
బాకు బాధ కన్న మిన్న
బాధించెను ఇంటిని కా
పాడలేని యట్టి బాధ"

ఎగిరిపోవు ప్రాణమ్ములు
బిగబట్టుక ధనముండెడు
గదివైపుకు కష్టముతో
కదల సాగె శునకమంత

యజమానుడు సూక్ష్మములో
ఆపదను గ్రహించి నాడు
పిల్లివోలె అడుగు లిడుచు
మెల్లగ తా నడచి వచ్చి

చప్పుడయ్యె ది తలుపులు
చప్పున మూసెను వేగమె
చిలుకువేసి పోలీసుకు
'టెలిఫోనే' చేసినాడు.

పరిగెత్తుచు వచ్చినారు
పదిమంది జవానులపుడు
తలుపులు తెరిపించి చూడ
ఎలుకలట్లు నక్కినారు

పట్టుబడెను బైటి దొంగ
పట్టుబడెను ఇంటి దొంగ
"దొంగ" మాటకేమి గాని
"దొంగబంటు" కథ వినుడీ !

తను సాకిన యజమానికి
దగాచేసి నట్టివాడు
మనిషై ఒక కుక్క కన్న
మరీ తక్కువైన వాడు

కుడిచినట్టి ఇంటిలోన
"ఖూని" చేసి నట్టివాడు
తిన్న యింటి వాసాలను
ఎన్నినట్టి "దగాకోరు"

కన్నులెత్తి యజమానుని
కనజాలక తలవంచెను
చచ్చిపడిన కుక్కను గని
చావలేక జీవించెను.

ప్రభువు కొరకు ప్రాణములను
బలసేయగ శునక మొకటి
స్వామి ద్రోహమ్ము జేసె
వంచకుడై నరుడొక్కడు

శ్వానము విశ్వాసములో
ప్రాణమునే బలిపెట్టెను

జ్ఞానములో దానికన్న
హీనముగా నరుడయ్యెను

జయ చంద్రులు కొందరిట్లు
జాతికి ద్రోహమ్ము చేసి
శ్వానముతో సాటిరాక
హీనముగా జీవింతురు

కన్నతల్లి కడుపు గుద్ది
తిన్న యింటికే కన్నము
వేయగ జూచెడు నీచుల
మోయగ ధాత్రికి భారము

అవినీతికి పొల్పడు మా
నవుని బ్రతుకు బహుహీనము
నీతి గలిగి బ్రతికెడు యే
జాతియైన గణనీయము.

# పరోపకారి

అసగనగా పూర్వమొక్క
అడవిలోన బుద్ధుడు తన
వెనకటి జన్మమున వడ్ల
పిట్టగ జన్మించి యుండె

ఎఱ్ఱని తుర్రాయి వంటి
ఎత్తు జుట్టు నెత్తిమీద;
వాడియైన పొడవు ముక్కు
చూడ కనుల విందుగొల్పు

దాని సొగసు కేమిగాని
జ్ఞానములో దా తో స
మానమైన మానవులే
కానరారు వెదకి చూడ

ముందు చూపు కలిగి, వచ్చు
ముప్పును తప్పించు కొనును
పగవానికిఁగూడ తోడు
ప[illegible]ట వె[illegible]ా కుం

క్రూర మృగము లుండునట్టి
ఘోరారణ్యంబది తా
నందే వసియించు చుండె
నంత టొక్కనాడు తాను.

చిగురు దినుచు చెట్ల మీద
నెగడు చుండ నొక్కచోట
కంటనీరు పెట్టి ఏడ్చు
కంఠీరవమును గాంచెను

ఏడ్చు మృగము జూచినంత
రై యెద పొంగి పారె
సమీపమున కే పక్షి
సామజరిపు నిట్లడిగెను

"మృగరాజా ! ఎందుకిట్లు
వగజెందుచు నున్నాడవు ?
తెలియజె ప్ప బాధేమిటో
తొలగించగ యత్నింతును

పరులకు తోడ్పడుటే భువి
పరమ ధర్మమందురు నీ
దుఃఖా హేతువేమి
తోడుపడగ నేనుంటిని"

జలము లేని యెండు యెడా
రుల వర్షము కురిసినట్లు
దప్పిగొన్న వానికి శీ
తల జల మందించినట్లు,

నిరుపేదకు పెన్నిధులే
దొరికినట్లు పక్షినోటి
శీతల వచనా మృతము
సింహమునకు హాయి [illegible]లిపె.

"పక్షిరాజ ! నీ వెంతటి
దాక్షిణ్య ప్రభువవో !
సంక్షోభించెడి నాపై
జాలి వాన కురిపించితి.

నను జూడగనే భయపడి
వని మృగాలు పారిపోవు
ఏమి చెప్పు దెవ్వారు క
న్నెత్తి నన్ను జూడ చట

నా మిత్రులు నా బంధులు
నాకు దూరమై రిప్పుడు
పాపాత్ముని కాపులైన
ఆపదలో అడ్డు[illegible]

నొగులు జెందు మృగము నోట
నెగడుచు వెల్వడెను నిజము
మ త్యు ముఖంబైన వాడు
సత మె వచియించు గదా !

ఖగశేఖర ! చూడమనుచు
కరియరి తన నోరు విప్పి
పంజాతో నోటిలోని
కింజూపెను అంతపక్షి-

కొంచెము దూరము నుండే
గొంతులోన నిరికి నట్టి
ఎముకను గని దూరముగా
ఎగిరిపోయి కూర్చుండెను

గొంతులోన ఎముక యిరికి
ఎంతో బాధగ నుండెను
గొంతంతా వా పోయి
కొంచమైన మ్రింగలేదు

డొక్కలోన అందులేక
చిక్కిపోయి వేటాడదు
డొక్కాడక రెక్కాడదు
రెక్కాడక బుక్కాడదు

తిండి యుండి తినజాలదు
తిన కుండిన యెండు చుండు
రాజై తానాకలితో
రోజు రోజు క్రుంగుచుండు

రాజ్యమున్న రమణులున్న
రంజింపగ జాలునా ?
ఆస్తిపాస్తు లెన్నియున్న
అనుభవింప జాలునా ?

భాగ్యవంతుడనగా ఆ
రోగ్యవంతుడే గదా !
భాగ్య హీనుడనగా ఆ
రోగ్య హీనుడే గదా !

ఆహారము దినజాలక
ఆకలితో అల్లాడుచు
చిక్కి చిక్కి స్రుక్కిపోవు
సింగముఁ గని ఖగమిట్లనె.

"కంఠీరవ ! వగవకు నీ
కంఠములో నుండి ఎముక
తీయుదు నా ముక్కు తోడ
హాయిగ నీ వుండవచ్చు

నీ నోటను దూరినపుడు
నీవు నన్నమాంతముగా
నమిలి మ్రింగవచ్చుగాన
నమ్మి చెడుట పనికిరాదు

గావున నే చెప్పినట్లు
నీవు చేయవలెను సుమా !
అటు చేసిన గాని నీకు
హాయిలేదు సింహమా" !

"అలాగే బాబూ ! నే
నా లాగే చేయగలను
నీ మాటకు ఎదురాడ
నే తల ధరియించగలను.

నీ ప్రాణంబున కున్నది
నా ప్రాణంబో ఖగమా !
నన్ను నీవు బ్రతికించుము
నిన్ను నేను మరువ సుమా "

అని దీనమ్ముగ మృగమన
విని ఖగమిట్లనె "అయితే
విప్పుము నీ నోరు నీవు
విప్పజాలినంత బాగ"

తత్క్షణమే హరియుకోట
తలుపులు విప్పిన తీరుగ
తన నోటిని పెద్దగ వి
ప్పెను ఖేచర మంతలోన—

గట్టి కట్టెపుల్ల నోట
కరచి తెచ్చి సింహముపై
దౌడ క్రిందిదౌడ మధ్య
తగ నిలిపెను మోపుజేసి.

ప్పుడు ంగమ్మ నోరు
చప్పున మూయంగ లేదు
బుద్ధ పక్షి సింహమునకు
ము దు మొ పై కూర్చుని

నోటి లోన తొంగి తొంగి
పాటవముగ చూచి లోని
తే ముక్కుతో నేర్పుగ
ఎము ను పొడ ంగసాగె.

కొ క్షణాలిట్లు పొడవ
గొంతులోని ఎముక ముక్క
పట్టు వదలగా తిన్న
పక్షి దాని లా వేసె.

బైట కరుగుదెంచి తాను
పాటు నెంచి మోపినట్టి
కట్టె పుల్ల లాగివేసె
కడపటి ప మరువకుండ

ఉత్తము లెవ్వారికైన
ఉపకారము యునపుడు
చివరి వరకు ఆపన్నుల
చిక్కుదీర్చి దరిజేర్తురు.

తత్ క్షణమే చెట్టుపైకి
పక్షి ఎగిరి కూర్చుండెను
ఎముక తీయబడ కేసరి
కెంతో హాయని పించెను

బాధ తొలగి నంతటనే
పక్షిని సింగంబు మరచి
వేట కొరకు లంఘించుచు
వెంటనె తా పరుగెత్తెను

అవసరమెల్లయు దీరిన
అగుపడ కుండగ బోయెడి
స్వాముల కొందరి నిందుకు
సామ్యంబుగ నెన్నవచ్చు.

కృతజ్ఞతల నైన దెలుప
కే కేసరి వెడలి పోయె
నరులందున కొందరిట్లె
పరువు లోపమని చేతురు.

## రెండవ భాగము

కొన్నాళ్ళ పిదప :

ఒకనాడా బుల్ పక్షి
నక నక లా ఆకలి
గొని ఆహారమ్ముకనై
వనమంతా వెదకసాగె.

కొమ్మ నుండి రెమ్మ పైకి
రెమ్మ నుండి కొమ్మ పైకి
ఎగిరి ఎగిరి వెదకి వెదకి
ఖగమెంతో అలసె సొలసె !

కాని పాప మా పక్షికి
కాన యెంత గాలించిన
తినుటకేమి దొరకలేదు
దిశలు జూడంగసాగె !

ఏ పాటును పొరపాటున
ఎప్పుడైన మరువ వచ్చు
సా పాటును మరువగాను
సాంబశివునకైన తరమె?

కోటి విద్యలెన్నియైన
కూటి కోసమే గదా!
కూటికి కొరగాని విద్య
పాటించుట వృథా గదా!

అంత పక్షి కాపదలో
అప్పుడు గనిపించినట్లు
తనతో సాయమును పొందిన
మనిన సింగముగుపించెను.

ఆ సింగంబప్పు డొక్క
హరిణమ్మును జంపి తినుచు
నుండె దాని జూచి పక్షి
కూరసాగె నోట నీళ్ళు.

మా సింహము మా మిత్రము
మంచి సమయమందు నాకు
గనిపించె నటంచు పొంగి
కరివైరిని జేరి ఖగము——

"మృగరాజా ! ఆకలితో
వగజెందుచు నుంటి నీవు
దిను మాంసము నన్నొకింత
దిన నీయవ నీ తోడను

తా నొనర్చి నట్టి మేలు
తలపునకు తే కుండగనే
ఎంత మృగంబైన గాని
ఏలిక యని యర్థించెను.

కాని సింహమది వినియును
కసరుకొనుచు గ ంచెను
అంత పక్షి తన పరిచయ
మవసరము యిట్లనియెను

"కం రవ ! ఏల యిట్లు
కసరెదు నను గు ర్తించక
నీ గళాన ఎముక తీసి
నీకు సాయపడినవాడ

నే నాకలితో నుంటిని
నీతో పాటీ మాంసపు
భోజనము నన్ను గూడ
భుజియి ్గ నీయవా"

సింహామంత హుంకరించి
చిందులతో పక్షిని ఆ
పొదమ స్తకంబు తేరి
పారజూచి ఇట్లనియెను.

"ఎవడవురా ! ఎవడవు న
న్నెరిగినట్లు మాట్లాడెదు
నీచు లిట్లె గొప్పవాళ్ళ
స్నేహానికి యత్నింతురు.

ఎవడవురా ! నీవు కొంచ
మేని రాచ మరా దలు
గు ర్తించక ఔరా నను
గూడి భుజింపగ జూతువు

నేను మహా రాజునైతి
నీ వల్పిరి పక్షివైతి
నేను దినే ఆహారము
నీ కర్హత గలదా తిన ?

నకెక్కడ ? నాకలోక
మెక్కడ ? ఓ పక్షీ !
నీ వెక్కడ నేనెక్కడ
నీ కున్నదె పిచ్చి !

మృగమాడిన మాటలు విని
ఖగము మనసు చివుక్కనెను
పదును కత్తి కన్న ఖలుని
పలుకే పదునైనది గద !

ఖడ్గ ఘాతియై నిద్దుర
గాంచ గలడు గాని ఖలుం
డాడు మాటబడి నిద్దుర
పోడుగదా రేయి బవలు

సింగము ములు పలుకులకు వి
హంగ మిట్లు బదులు పలికె
సరసముగా నిశితమైన
శరము లనెడి మాటలతో

ఆత్మ గౌరవమ్ము భంగ
మౌనప్పుడు సైచు నెవడు ?
తన్నినచో దుమ్మైనను
తలపై కెగురంగ జిమ్ము

గద్దె మీది వాడైనను
ద్దుమీరి చరియించిన
చాఁ మీది వానికైన
ఊఁ దమా అనిపించును.

పక్షి : "స్వామీ! నే జ్ఞాపకమున
కే మాత్రంబైన లేన
దేవర కంఠాన ఎముక
తీసి వాడను కానా ?

గొంతంతా వాపెక్కి ర
వంతైనా మ్రింగలే
ఆకలితో అల్లాడిన
ఆపత్తిని మరచితిరా!

నీవు నేను భాయి భాయి
దేవరలేనా అన్నది ?
నీ ప్రాణంబున కున్నది
నా ప్రాణంబని యున్నది ?

నన్ను నీవు రక్షించుము
నిన్ను నేను మరువ సుమా!
అని యన్నది మరచితిరా
అ తలో మృగ రాజమ !

స స ! ఇపుడ మయ్యె
మరుపు లంటె గొప వాళ్ళ
పరువు కొరకు పద కొరకు
ప్రయోగించు ఆయుధాలు.

ఆపదలో మ్రొక్కుబడులు
అది తొలగిన మతి మరుపులు
అంతేలే గొప్ప వాళ్ళ
ననగూడదు చిన్నవాళ్ళ"

మల మల మరిగే నేతిని
జల బిందువు పడినట్టుల
భగ్గున మండుచు కేసరి
పలికె నిట్లు పక్షితోడ

"పిట్ట కొంచెమైన కూత
పెద్ద దన్న సామెతగా
హద్దుమీరి పెద్దలతో
బుద్ధిలేక పలికెదుగా !

నీ వప్పుడు నా నోటను
ప్రవేశించ కనికరించి
నిన్ను మ్రింగకుండ వదలి
నీ ప్రాణము రక్షించి

అందుకు నా వుపకృతి
శాంతముగా ఓ పక్షీ !
కృతజ్ఞుడ గ నుండ కుండ
కృతఘ్నుడుగ నుంటివి ఛీ !

అస్మదీయ దయాభిక్ష
నంది బ్రతికి నట్టి నీవు
నన్నే రక్షించితి వన
నాకు నవ్వు తెప్పించును."

తా నెదో తెలివైన సమా
ధాన మిచ్చితని సింహము
మురిసి పోవు చుండ పక్షి
చిరు నవ్వొలకంగ పలికె

"బలే బలే బలే తెలివి !
తెలివి తెల్లవారినట్లె
నోరు మూయ యట్టి
దారు పెరుగు తమరి తెలివి

తమరి దయా భిక్షకు తమ
దౌడల రెంటికి మధ్యన
పోటిగ నిలబెటి నట్టి
ఈ పె వంటి ట్టె సాక్షి

ఎవరి నెవరు రక్షించిన
దెవరి కెరుక తమరి కన్న !
కంఠములో నిరికి నట్టి
కంటకమే తొలగకున్న !

మీ బోటి కృతఘ్న మహా
మ్లేచ్ఛ చక్రవర్తులచే
ముప్పుల బహుమతులు రాక
తప్పవంచు నేనెరుగుదు

తమరు క్రూర ప్రభువు లంచు
తప్పక ఉపకారికైన
అపకారము చేయగ వెను
కాడని ఘనుల యెరుగుదు

పాల్పోసిన వానినైన
పాము కరువకుండునా ?
నీచుడు మేల్పొందియు తన
నిజ తత్వము మానునా ?

అయినా తమరంత వార
లయినా ఆపన్నులకున్
దోడు పడుట ధర్మమని
తొలంచితి మీ బాధను

అందుకు ప్ర ఫలము నేడు
అందుకొంటితే ! బతే !
మీ క తఘ్న దావానల
మూర్త[illegible] న ఔనుతే ”!

పశ్చాత్తాపాగ్నికి మృగ
పతి హృదయము కరగి కరగి
కన్నులలో జల జల మని
కడలెత్తుచు ప్రవహించెను.

కృత తాపవృష్టి కు సి
కృతఘ్నాగ్ని చల్లారెను.
జ్ఞానోదయ మాయెను అ
జ్ఞానాంధ్యము నశియించెను.

ఖగము మాట కెదురు లేక
మృగ మప్పుడు తలవంచెను
చమత్కారమున క దరు
నమస్కా మొనరింతురు

మ గ మంతట " కెనిట్లు
"ఖగశేఖర ! నీ మహా
జ్ఞానివి త్యాగివి నాలో
జ్ఞానోదయ మొనరించితి.

శేచర వర ! మీకు నేను
నీచుడనై మూర్ఖుడనై
సల్పినట్టి అపచారము
క్షంతవ్యముకాదు గదా !



నాడు ప్రాణభిక్ష పెట్టి
నేడు క్షమా భిక్ష పెట్టి
తున్న నేను జీవచ్ఛవ
మన్న మాట నిజము గదా !

కరుణామృత రసవాహిని !
ఖగమణి ! నను క్షమియించుము
వేగ వచ్చి నన్ను గూడి
విందు గొల భుజియింపుము

మీ మహోప కారమునకు
ఈ మాంసపు ముక్క యెంత
నామేనే వలచి యిచ్చి
నను దీరునె మీ ఋణమ్ము"

మృగము గూడి ఖగమప్పుడు
తృప్తి దీర భుజియించెను.
నాటి నుండి మైత్రీలత
వాటి మధ్య చిగురించెను.

# తానాజీ

అది ప్రతాప గడ దుర్గము
అందున పై కిటికి నుండి
కొందన కోటను గనుకొని
చిందులు ద్రొక్కుచు నున్నది

ఆ కోటను గనినంతనె
ఆమె కంత కినుకెందుకు
అందున తానొక్కప్పుడు
బంధితురాలై నందుకు.

ఆమె పేరు  జా బాయి
ఆత్మ గౌరవము  లది
ఖా తీయ  ర మాత
వీర శివాజి  గన్నది .

రమ్మని వేగమె కొడుకును
రాజమాత పిలుపంపెను
తత్ క్షణమె శివాజి వచ్చి
తల్లి కాళ్ళపై వ్రాలెను.

"ఆజ్ఞ ఏమిటమ్మా !" అని
అడిగినంత తల్లిట్లనె
"పాచిక లాడుము నాతో
బదులాడక ముందు నీవు"

"అమ్మా ! తో పాచిక
లాడుట వ'''న్న గాని
తల్లి వినక పోయె తుదకు
తప్పదయ్యె పందె మాడ

పందెములో ఓడి కొడుకు
పలికె ట్లు "అమా ! నా
కోటలలో దేనినైన
కోరుకొనుము దాని త్తు"

"పసి వాడుగ నీవుండగ
పగతురు నీ తండ్రిని ఓ
డించి నన్ను ందున బం
ధించిరో ఆ కోటనిమ్మ

ఆ కొండన కోట తప్ప
నాకే కోరై ప దు".
అని పలికె తల్లి అంత
క్షణమాలోచించి కొడుకు—

"జననీ ! అది ప్రస్తుతము
సాధ్యము కానిది, దానిని
కాపాడుచు నున్నవారు
గండర గండరు లెందరో !

అది ఇపుడౌరంగజేబు
అధీనములో నున్నది
ఉదయ భానుడను యోధుడు
ఉన్నాడందున కాపల

కొందన కోటను బట్టగ
కొంత గడువు కావలయును."
అని పలుకగ, వీరమాత
ఆవేశముతో నిట్లనె

"ఔరా ! నాలో పరాభ
వాగ్ని రెచ్చగొ న ఆ
కోటను పట్టియలేని
కొడుకు నాకు పుట్టెగదా !

సిగ్గు ! సిగ్గు ! నా కడుపున
చెడపుట్టెను పిరికిపంద
మహారాష్ట్రి వంశకీర్తి
మట్టిలోన గలిసె గదా !"

 గేయ కథః

ఆవేశముతో పలికిన
అమ్మ పలుకు లెదగ్రుచ్చగ
పౌరుషమ్ముతో శివాజీ
పలికెనిట్లు తల్లితోడ

"తల్లి ! నీకా కోటను
తప్పక పట్టిచ్చువాడ
నీలోని పరాభవాగ్ని
నేనిక చల్లార్చువాడ !"

కార్యసాధనమ్ము గూర్చి
ఘడియసేపు చింతించెను
సుబేదారు తానాజీ
శూరుడు తలపుకు వచ్చెను

వెంటనె రమ్మని అతనికి
వేగ వర్తమాన మంపె
అపుడాతడు కొడుకు పెండ్లి
హడావిడిని మునిగియుండె.

పిలుపందిన వెనువెంటనె
పెండ్లి పనులు మానివేసి
ప్రభు ఫాజ్ఞను పాలింపగ
పయనమయ్యె రాజుకడకు

తమ్ముడు సూర్యాజీ పిన
తండ్రి సెలార్‌జీ మరియును
వెయ్యిమంది సైనికులను
వెంటబెట్టుకొని వచ్చెను

ప్రభు కార్యము ముందు సొంత
పనులు "బలాదూరు" చేయు
తానాజీ వంటి త్యాగ
ధనుల కీర్తి ధరణి నిలుచు

అమ్మవద్ద కరగు మనుచు
నెమ్మదిగ శివాజీ పలికె
అంతట తా రాజమాత
చెంత కరిగి వినయముతో

తలపాగను దీసి భక్తి
వెలయ నామె పదములపై
నుంచి "ఆజ్ఞ" యని శిరస్సు
వంచి వందనమ్ము జేసె

"తానా ! కొందన కోటను
తగ నాకర్పించు గెలిచి"
అనినంతనె "అది యెంతటి
పని" అని తానాజి పలికె.

సాహస వీరుల కేదియు
సాధ్యము కానిది లేదిల
తానాజీ అంతేనే
ధైర్యమునకు మారుపేరు

జయభేరులు మ్రోగించుచు
బయలుదేరె సైన్యముతో
తన సేనలు కొంత దూర
మునను దాచి తానొకడే—

కోటవైపు పోవుచుండ
బాట నడుమ అడవిజాతి
'కొలీల' తని పట్టుకొనగ
చలాకిగా పలికెనిట్లు

"మెకము తరుమ వచ్చితి నే
నొక ఊరి పటేలు" ననుచు
తమలపాకులును పొగాకు
దండిగ వారికి పంచెను.

పాగాలో దాచినట్టి
బంగారపు నాణెములను
బహుమానముగా వారికి
పంచి— నంత వారు

స్నేహితులై మెలగసాగ
చిన్నగ తానాజీ పలికె
"కోటగుట్టు తెలిపినచో
కొల్లలు బహుమతులు మీకు".

అంత 'కలీలా'స పడుచు
ఆ కోట రహస్యమెల్ల
చెప్పిరి ధనమాశపెట్ట
చెలిమి అదే పుట్టివచ్చు

"కోట కన్ని దిశల రెప్ప
పాటులేని కాపల గల
దైన ఒక్క తూర్పు దిక్కు
అవుతే వీలవ వచ్చును."

అని చెప్పగ తానాజీ
అటువైపు వందమ
సైనికులను వెంటనుగొని
చనుదెంచెను రాత్రివేళ

"యశ్వంత"ను ఉడుమొక్కటి
అదివరకెన్నో కోటల
తెగ ప్రాకి శివాజి రాజు
కెంతో సాయమ్ము జేసె.

దాని నడుమ కొక పొడుగగు
త్రాడు గట్టినారు వారు
దాని మూతి కపుడొకింత
తేనె రాచినారు వారు

అంతట ఆ కోటమీది
కది యెగబ్రాకుచు పోయెను
తేనె తగిలినంత ఉడుము
తెగబ్రాకుట దాని గుణము

ఖడ్గము తన పళ్ళతోడ
గట్టిగ బిగబట్టి పైకి
త్రా ట్టి యెగబ్రాకెను
తానా మును ముందుగ

అటు పిమ్మట పినతండ్రియు
యాబై వీరులు ప్రాకిరి
అ తలో 'పుటుక్కు' మనుచు
అకటా ! తెగిపోయె త్రాడు

పినతండ్రి సెలారుడంత
తిలి క్రిందికి దూకగ
పోవుట గని తానా
పురుష సింహ మిట్లు పలికె.



ఖడ్గము తన పళ్ళతోడ గట్టిగ బిగబట్టిపైకి
త్రాడుబట్టి యెగబ్రాకెను తానాజీ మునుముందుగ

"పిరికిపంద పెక్కుసార్లు
బెదరి చెదరి చచ్చుకాని
చావు భయమొకింత లేక
చచ్చు వీరుడొక్క సారె

పుట్టిన ప్రతి ప్రాణి దర
గిట్టుట తప్పునె ? నీవి
చావకుండ పంద వౌచు
జీవించెద వెన్నినాళ్ళు ?

పందవోలె పారజూచి
క్రిందకు దూకెద వేనీ
నీ కంఠము తెగ నరుకుదు
నీ వీ యత్నము మానుము"—

అని కత్తి ఝ పించి
పినత    నాపి, తా
నాజి వీరుడు కోట
లో జొచ్చుకొనిపోయె

అతని వెనువెంటనే
అతని యేబది మంది
కోటలో జొరి భటు
కొట్టి చంపుచు వారి

గే

కెదురుబడు సైనికుల
పదను కత్తుల నరికి
ముందు ముందుకు సాగి
పోవుచుండిరి వారు

అంతఁ కోటలో
అలికిడాయెను యుద్ధ
భేరి మ్రోగెను పోరు
జోరుగా కొనసాగె

మదపు టేన్గు పైబడగా
ఎదురువచ్చె-అంత దాని,
గండు సింగమై 'తానా'
ఖడ్గముతో నరికి చంపె.

అంతట సేనా వచ్చె
అతని పేరు 'సిద్ది హిలాల్'
తానాజీ కెదురు తగిలె
తగరు గిరిని తాకినట్లు

తానాజీ ఖడ్గముతో
సేనానిని వధియించెను
అడ్డుపడ్డ సైనికులను
హతమార్చుచు ముందరిగెను

మైకములో నున్నవాడు
మత్తేభము వంటివాడు
ఉదయ భానుడనెడి మహా
యోధున కిది తెలిసిపోయె

తన కొడుకుల పోరునకై
తరలించెను మునుముందుగ
వారలు తానాజి ఖడ్గ
ధారల కెరయై పోయిరి.

అంతట తానే స్వయముగ
ఆగ్రహము తో వచ్చెను
'తానా' ఆ వీరునితో
తలబడి పోరాడసాగె

వారిద్దరు చాల తడవు
ఘోరముగా నొకరినొకరు
తీసిపోక కత్తులతో
తీవ్రముగా పోరాడిరి

ఉదయభాను డపుడపుడే
యుద్ధమునకు వచ్చినాడు
అదివరకే పోరి పోరి
అలసినాడు తానాజీ

అయినా తన దేహములో
ఆఖరి నెత్తురు చుక్క ఒ
కింత మిగిలినంతవరకు
పంతముతో పోరుచుండె

వెనుకాడక శౌర్యముతో
రణమందున తానాజీ
సమర వీరుడౌచు తాను
అమర వీరుడై పోయెను

అతడట్లయి పోవుటగని
ఆగ్రహంబు పట్టలేక
భగ్గుమని సెలారు దుదయ
ఖానునిపై దూకి పడెను

సెలారు రౌద్ర దావాగ్నికి
శలభమాయె ఉదయఖాను
డిక తక్కిన మొగల్ సేన
తికమక డి పారిపోయె.

ఢిల్లి జెండా దించి
శీవిగా కాషాయ
ధ్వజమెత్తి సుర్యాజీ
[illegible]

వినిపించె ఫిరంగి ధ్వనులు
విజయ సూచకముగ అంత
చేరవచ్చెనటకు తెల్ల
వారగనే ఛత్రపతియు

తనకెదురు వచ్చు వా
రిని గాంచి ఛత్రపతి
కను లిందు నందునను
కలియ జూడగ సాగె

ఎటు జూచినను గాని
కటకటా! తానాజి
తనకెదురు రాడు కా
రణమేమి యుండునో!

రణభూమి నొకచోట
గనెను 'తానా' కళే
బర మంతలో దాని
పై వ్రాలి దుఃఖించె!

నా తల్లి యాజ్ఞ నీ
వే తలను దాల్చి వి
నాకు సోదరు డీవు
నాదు ప్రాణము నీవు

అని దుఃఖపడు శివా
జిని జూచి ఓదార్చ

దలచి ఎవరో ఇట్లు
పలికి రాదర మొప్ప !

"ఓ మహారాజ ! తా
నొక్కడేబది సైని
కులతోడ ఈ కోట
గెలిచి తమ కర్పించె-

వీరుడై సమరాన
పోరాడుచును అమరు
డై నాడు రిపు విజయు
డైనాడు తానాజి !
విలపించకుము మహారాజ !
విజయుడాతడు వీరభోజ !"

ఆ మాటలను విన్న
యంత వీర శివాజి
పలికె నీ రీతి యెద
బరువుతో బాధతో—

"కోట దక్కెను గాని
కోల్పోతి సింహమును"
కోటి కోటలు "తాన"
గోటితో సాటౌనె ?

నాటి నుండి ఆ కొండన
కోట "సింహగడ" మయ్యెను
తానా రగాథ
నానాటికి వినవచ్చెను

ముందు చూపు

అనగనగా ఒక గుమాస్త
అతని గొడవ వినుడి కాస్త
పొదుపంటే గిట్టక ఆ
పదలోఖడి అలమటించె

తా తెచ్చిన జీతములో
దమ్మిడైన దాచలేడు
పొదుపులేని ఖర్చుగాడు
ముందుచూ   లే వాడు

ధరలు మింటినంట పెరిగి
కరువు మంట లంటుకొనిన
సరదాలకు జలా   కు
కొరతలేక ఖర్చు పెట్టు

లేనిపోని అలవాట్లకు
బానిసయైపోయి గూడ
తానొక దొరనంచు డబ్బు
తగుల బె   మిగులకుండ

పొదుపంటే పొసగదెపుడు
అదుపే లే దలవాట్లకు
'ఉంటే వైకుంఠం లే
కుంటే ఊకుంట' మనును

ఇట్లు కొంత కాలా కి
ఏదో ఒక జబ్బు రాగ
సెలవుపెట్టి కొన్నినాళ్ళ
కొలవు మాని మూలబడెను

సెలవులోన కొలువులేదు
కొలువులేక డబ్బులేదు
డబ్బులేక జబ్బుపోదు
డబ్బంటే ఊర్కెరాదు

డబ్బుండిన వాడెవ్వని
అబ్బకు భయపడడు ఇంక
జబ్బునకా ? జడుచుమాట ?
డబ్బుకు డాక్టర్లులేర ?

కానీ ఆ పొదుపు లేని
వానిచేత కానిలేదు
అప్పా ! అయ్యా ! అంటూ
అప్పులకై బయలుదేరె

అప్పు చేసినాడు కాని
అప్పు తీర్చలేదు; మిత్తి
నెలనెల చెల్లించు; కాని
నెలకు రూక దాచలేదు.

కొన్నాళ్ళిట్లే గడిచెను
కూతురు పెండ్లి వచ్చెను
అప్పులుండి అరబులతో
అప్పుతెచ్చి పెండ్లిచేసె

అప్పు తీర్చలేకపోయె
ముప్పులు కొని తెచ్చుకొనియె
తిప్పలెన్ని ప గాని
తీర్చలేడు వడ్డీ నె

అప్పులు దీర్చుట కొరకై
అప్పులనే చేయుకాని
పొదుపుకై దుబారా ఖర్చు
నదుపులోన నుంచలేదు

అప్పుల నిప్పులలో బడి
అవక తవకలను చేయగ
కొలువు నుండి అధికారులు
తొలగించిరి వానినపుడు

ఉద్యోగము ఊడిపోయె
ఉన్నదేమి వానికిపుడు ?
పొదుపు చేసియుండిన ఆ
పదలోనది అడ్డుపడదె ?

తెరువుపోయి పరువుపోయి
తిరుగు దిమ్మరై అయ్యో !
పిల్లల జల్లలతో తా
బిచ్చమెత్త బజారెక్కె !

నిలువ నీడలేదు, కడుపు
ని డ తిండిలేదు, కప్పు
కొనగ గుడ్డలేదు, పిల్ల
లను గని కన్నీళ్ళురాల్చు !

ఒకనాడతడెటు తోచక
ఒక వృక్షము క్రింద కూరు
చుండి పై చూచుచుండ
ఒక చిత్రము గనుపించెను

క పుల్ల గ పోచ
పిట్టనోట తెచ్చి తెచ్చి
పుట్టబోవు పిల్లలకయి
క చుండె గూడు నొకటి

ముందు చూపు లేని వట్టి
మూర్ఖుడనైనట్టి నాకు
పక్షి యెంత చిన్నదైన
సాక్షి గురువటంచు దలచె

అంతలో మరొక్క చిత్ర
మందే కని అతడిట్లనె
ఓహో ! చీమల బారులు
ఆహారము పొదుపు చేయు

ఏమి యింత చిన్నప్రాణి !
ఎంత గొప్ప పొదుపు రాణి !
నేను మానవుడ నైనను
దీని ముందు హీనుడనే !

ముందు ముందు బ్రతుకు కొరకు
ముద్దుగ తమ ఆహారము
పొదుపు చేయు చీమ లహహా !
బోధ చేసె మానవునికి

బోధి క్రింది బుద్ధుని వలె
పొదుపు బోధ పొంది అతడు
లేచి వచ్చి ఏదో కూ
లీ పని కుదిరించు కొనియె

నాటి నుండి పొదుపు గుట్టు
సూటిగ తెలియంగనె తన
సంపాదన నుండి కొంత
పెంపొరగ కూడ బెట్టె

కొలది కొలది పొదుపు చేసి
గొప్ప ధనికుడై పోయెను
అప్పులెల్ల దీర్చి కొనెను
ఆనందముగా నుండెను

ఇదే పొదుపు క వినుడీ
పదే పదే చదువుడీ!
ముందుచూపు కలిగి పొదుపు
ముచ్చటగా చేయుడీ!

[1 లో సా ల్ సేవింగ్ వా [illegible] ర్వహించిన రాష్ట్రస్థాయి జాతీయ గేయ [illegible] లో ప్ర మ బహు [illegible] కొ న్నది. (Hindu)
[illegible] దుపు మా [illegible] సులో [illegible] చరిత — [illegible]

# ప్రమత్తుడు

అనగనగా ఒక కుటుంబి
అతని కారుగురు పిల్లలు
బహు సంతతితో నాతని
బ్రతుకంతా పడె చిల్లులు

ఉన్నదంత అతగానికి
ఒక్కెకరం పొలమే !
అందు పండు గింజలన్ని
ఆరునెల్ల బత్తెమే !

కాని అతని ఇల్లాలికి
కాన్పుతప్పదేటేటా !
సంతానం పెరుగు కొలది
సంసారం ఘాటా !

ధరలు మింటి నంటు పెరిగి
కరువు మంట ంటుకొన్న
ఈ దినాల ఏమి ఖం ?
ఇంతమంది పిల్లలున్న !

మళ్ళీ మళ్ళీ కాన్పులతో
ఇల్లాలికి బలహీనం
అప్పులతో ముప్పులతో
అతని బ్రతుకు కడుహీనం

చాలంటే మళ్ళెప్పుడు
ఇల్లాలికి చూలాలు
కరువు కథిక మాసమట్లు
నిరుపేదలకే పిల్లలు

తినటానికి కరువు గాని
కనటానికి కాదుగదా !
పోషించగ బరువు గాని
పుట్టించగ కాదుగదా !

ఒకడు చంకనుండగ నిం
కొకడు కడుపులో నుండును
కాన్పు కాను కిల్లాలికి
కడుగండముగా నుండును

చనుబాలకు చంటివాడు
దినమంతా పోరుపెట్టు
పాలచుక్కలే త ల్ల
రాలుచు కన్నీటి బొట్టు

అంగిలకు చెడ్డీలకు
అంగలార్చి బాలుడొకడు
పై మీదికి బట్టలేక
బరి బత్తల దిరుగునెపుడు

పుస్తకాలు కొననందుకు
స్వస్తి చెప్పు చదువు కొకడు
డబ్బులేక మందు గొనక
జబ్బు పోక మూలునొకడు

ఏడ్వలేక నవ్వు నొకడు
నవ్వలేక ఏడ్చునొకడు
పువ్వువంటి వయసులోన
బువ్వలేక మూడునొ డు

కప్పుకొనగ లేక చలి
కంపిల్లెదు పసిపిల్లలు
కటుకు దరిద్రపు పిడి ట
గజిబిజియగు చిరుమల్లెలు

తిండి చాల కాకలిచే
ఎండిపోవు చిన్నారులు
పాడులేమి పురుగు గొట్టి
వాడు పట్టు చిగురాకులు

నరకపు దారిద్ర్యంలో
నలిగిపోవు పిల్లలగని
కన్నవాళ్ళ గుండె కరిగి
కనుల నిండు జలజలమని

పేదరికంలో పిల్లల
రోదన వినలేము గదా!
దరికం కన్నమిన్న
పెనుభూతం లేదుగదా!

హైన్యంలో దైన్యంలో
అల్లాడుచు అతని బ్రతుకు
అకటా! అన్యాయముగా
ఆగమాగమాయె కొసకు

చింపిరి చింపిరి గుడల
చిందులాడు దరి ం
పట్టపగలు లువురిలో
పకపకమను దీనత్వం

పె కూతురెదిగి చ్చి
పె డుకు వచ్చెను
పె న ఎ కుటుంబమును
పేదరిక పెనవేసెను

డబు గూర్చుకొన్న ఎవ్వ
నబ్బ భయము లేదుగదా !
అబ్బా ! పిల్లల ఖర్చులు
డబ్బుగూడ నీవు గదా !

ఆదాయం ఒక్కపాలు
వ్యయం నాల్గుపాళ్ళుగదా !
పిల్లలెక్కువైన ఇల్లు
చిల్లి వడ్డ కుండ గదా !

ఉన్నదేమి అతని కిపుడు
ఊరంతా అప్పులు
దినమంతా ఎంత శ్రమిం
చిన ఉడకవు పప్పులు

బిచ్చమెత్తి జీవించుట
బిడియముగా నుండును
అప్పులున్న మళ్ళి మళ్ళి
అప్పు పుట్టదుండును

రెక్కలార్చి డొక్కమాడ్చి
రొక్కమెంత గడియించిన

ఏ పూటకు ఆ పూటే
ఇంతమంది పిల్లలయిన

మంది ఎక్కువైతే మరి
మ గ పల్చన కాదా !
చిన్న కుటుంబముగ నున్న
చిక్కదనం ఉండుగదా !

అప్పుల నిప్పులలో బడి
ముప్పులు కొని తెచ్చికొనెను
అది వరకే ఉన్న పొలం
అప్పుల కాహుతి యయ్యెను

తెరువుపోయె పరువు పోయె
దిన వెచ్చము దీరదాయె
నిలువ నీడ పోయె కడుపు
నిండ తిండి లేకపోయె

పరిమితిలో పరమార్థం
ప కించక పోయెను
. తి దప్పెను గతి దప్పె ను
బ్ర- కు భారమాయెను

ఒక నాడాతని యింటికి
ఒక మిత్రుడు వచ్చెను
మిత కుటుంబమును గురించి
హితమిట్లని చెప్పెను

సంతానం పెరుగు కొలది
సంసారం బరువు గదా !
బరువు మరీ ఎక్కువైన
పడవ మునిపోవు గదా !

మితిమీరిన పరివారం
శ్రుతి మించిన వ్యవహారం
పరిమితిగల సంసారం
బ్రతుకంతా బంగారం

మంచము కురుచైన కాళ్లు
ముడుచుకొనుట తప్పదు కద !
స్థితిని బట్టి సంతతి పరి
మితము సేయ హితము గదా

దిన దినమ్ము పెరిగి పోవు
జనాభాకు సరి సరిగా
పెరుగవు పంటలు పిల్లలు
పెంచుట బహు కష్టముగా !

పరివారం పెరుగునట్లు
ఫలసాయం పెరుగునా ?
ప్రగతి యెంత సాధించిన
పరిమితఘ్నను మించునా ?

జింక దౌడు దీసినట్లు
చీమ పరుగు లెత్తునా ?
తాటిచెట్టు పెరుగునట్లు
తంగెడిచెట్టెదుగునా ?

ప్రజాహితం ప్రతివానికి
పాటించగ వలదా ?
సంఘ సౌఖ్యమందె వ్యక్తి
సౌభాగ ం లేదా ?

ము[illegible] ము[illegible]గా [illegible] రు
ముద్దబంతి పువ్వులు

వద్దు వద్దు అంతకన్న
హద్దు మీరి పిల్లలు

అతి సంతతి జనులను దు
ర్గతి కీడ్చుక దెచ్చునయా !
మిత కుటుంబ మేర్పరచిన
బ్రతుకే బంగారమయ్యా

1968 లో ఆకాశవాణి హైద్రాబాదు నుండి పాటగా ప్రసారమైంది. అవర్ ఫ్యూచర్ హెల్త్ మాగజైన్‌లో ప్రచురితమైంది.

"ప్రమత్తుడు" మరియు "ముందుచూపు" ఈ రెండు గేయ కథలు ప్రచారం కోసం గాయకులు వాడుకొనవచ్చును.

